# వేంకటాచలరమణశతకము.

# SREE VENKATACHALARAMANA SATAKAMU.




గ్రంథకర్త:

పప్పు మల్లికార్జునరావు, బి. ఏ.,

రిటైర్డు డిప్యూటీతహశ్శిల్దారు

రాజమండ్రి

PAPPU MALLIKARJUNA RAO B. A.,

*Retired Deputy Tahsildar. Rajahmundry.*



శ్రీ సుజనరంజనీ ముద్రాక్షరాలయం

రాజమండ్రి

**1938**

శ్రీ శస్తి

# శ్రీ వేంకటేశ్వరాయనమః॥

---

క॥ శ్రీసత్యరూపధారణ
వాసవముఖ విబుధలోక వందితచరణా।
భాసిత జగదుద్భవ వి।
న్యాసాంతాచరణ వేంకటాచలరమణా॥

నీ వెలసినమల తిరుమల।
నీవే తిరుపతివటంచు నిరతము భక్తుల్।
సేవింపఁగఁదన్నామం।
బావరపురిదాల్చె వేంక॥

బహుదూర దేశముల నీ।
మహిమల్ వెలయంగ సంభ్రమంబున జనముల్
బహుమతులు మొ్రొక్కులుంగాని।
యహరహ మేతెంతు వేంక॥

కలి ముఖ్యదైవతమ్మలై।
నెలకొల్పితి విగ్రహముల నిరసించెడు మూ।
ఖుల మానసముల చోద్యం।
బలరఁగ సద్భక్తి వేంక॥

ఈలోకదిక్రివర్తన।
మాలోకింపంగ నీమహత్త్వము దోఁచున్।
డోలాయమానమానస।
సాలోచనగతుల వేంక॥ 5

తన యింద్రియము మూలము।
ననెగద గ్రహియింపఁ బ్రకృతి నరుఁ డెవ్వఁడున్।
గననోపునె సత్యము నీ।
యనూనకృప లేక వేంక॥ 6

నామంబు రూపమును గా।
కేమగపడుచుండు సృష్టి నివిత్యజియింపం।
గా మిగులు సత్పదార్థమ।
వై మెఱయుదు వీవు వేంక॥ 7

మాయాప్రతిబింబుఁడవై।
యీ యఖిలాండములకెల్ల నీవుఁడవె; యవి।
ద్యాయత్త ప్రతిబింబుం।
డాయెను జీవుండు వేంక॥ 8

జీవుఁడు నిజస్వరూపము।
తో వెలయున విద్యయెల్లఁ దొలఁగవలె న।
ట్టే విడువ నీవు మాయయు।
నావలనదె యాదు వేంక॥ 9

జీవుని కించిద్జ్ఞతయును।
దేవుని సర్వజ్ఞతాప్రతిష్టయు నాయరా।
యావరణల భేదంబుల।
నైవరలుంగాదె వేంక॥ 10

ఒకయాత్మ యెగలదందఱ।
నిఁక భేదముభ్రాంతియంచు నెఱిఁగి నరుఁడే।
రికి హింససేయకొప్పడు।
నకలంకపుబ్రేమ వేంక॥

మమకార మహంకారము।
క్రమాగత నేక జన్మకర్మజములై యై।
శ్రమమిచ్చుచుండు నరునకు।
నమనస్కత లేక వేంక॥ 12

రాగ ద్వేషంబులు గద।
బాగుగనాధారమయి ప్రపంచము నడుపుఁగా।
యోగిసుఖంచును రెంటిని।
త్యాగముసేయంగ వేంక॥ 13

సుఖదుఃఖంబుల సమతఁ॥
సఖురీతిపరార్తులుడు సజతనంబుత్రియా।
శిఖబోధగలుఁగు నరుఁడ।
య్యఖిలార్థములొందు వేంక॥ 14

ఆజన్మాంతము తృష్ణా।
భాజనుఁడయి విరతిలేక భ్రమియించునటం।
డోజగనెడు దృశ్యజగ।
ద్వ్యాజపుమృగతృష్ణ వేంక॥ 15

చేతికి నందినదెల్లయు।
వాతఁ మ్రింగుచును శైశవంబుననుండుఁ।
చేతమున గ్రాహ్యముఁ బలె।
నాతురపడుతృష్ణ, వేంక॥ 16

బాలదశ ఖేలనంబు ।
నాలోలుండగుచుమది దురభ్యాసములఁ।
వ్రాలఁగ శ్రమపడుచుండు న।
దాలంబనలేక వేంక॥ 17

స్త్రీలోలత యౌవనమున।
కాలముభోగముల గడుపఁగా వాంఛయుదిఁ।
జాలఁగఁ బెంపొందుచు గా।
ర్యాలోచననింపు వేంక॥ 18

కౌమారమందు ధనముఁ।
భూములు గడియింపఁగాంక్షపొదలఁగఁ గైకో॥
నేమార్గమేనిబట్టును।
వ్యామోహాతమిూఁజు వేంక॥ 19

ఒడలను మనమున దార్ఢ్యం।
బుడిగినఁదావృద్ధి యావయోవృద్ధిని నె।
ప్పుడు కామమద్దిసర్వం।
బడుఁగడుఁగునగోరు వేంక॥ 20

సకలానర్థపుతృష్ణ ।
బెకలించిలయింపఁ జిత్తవృత్తియె సత్వా।
ధకమగుటఁ జేయవలెనది।
యకలంకముగాఁగ వేంక॥ 21

గతజన్మవాసనలచే।
సతతము మనమేగుచున్న సత్సహవాసో।
ద్ధృతిమాఱ్పుఁ జేయగావలె।
నతులితముగదాని వేంక॥ 22

ఆవరణశుద్ధమగు నేఁ।
బోవు మనోద్వేగమెల్ల; బొడముశమాదుల్।
తావక పదాబ్జభక్తియు।
నావల నెఱుకయును వేంక॥ 23

ఎంత విశారదుఁడైనఁ।
గాంతా కనకమ్ములనాశగదలకయున్నఁ।
స్వాంతవిశుద్ధత[redacted] దు।
రంతములఁ జేయు వేంక॥ 24

తురగములరీతి వశతఁ।
జరియింపఁగ నింద్రియములు సంతృప్తినిఁ।
తిరిగిన నవశతదుష్పథ।
మరయంగాలాగు వేంక॥ 25

మనసు దృఢంబుగ నరిక।
ట్టిన నింద్రియవృత్తు లెల్లడించు భవత్పా।
దనిరూఢభక్తి కదురా।
ననయము హృదయంబు వేంక॥ 26

వ్యవసాయాత్మికమా బు।
ద్ధివలన మాననమునిల్పి తిరముగ ఫలసం।
ధివివర్జిత కర్మలఁ జే।
యవలెఁ బ్రియసేవ వేంక॥ 27

విశ్వమయుఁడ వీవగుటఁ।
విశ్వము సేవింపనదియె నీసేవయగుఁ।
శాశ్వతసుఖ సంధాయక
మైశ్వర్యప్రదము వేంక॥ 28

ఒరుకష్టములఁ దనవని।
అరయుచుఁ బాపంగఁదగుసహాయము నత్యా।
దరమునఁ జేసిన నరునకు।
నరుదగుజన్మంబు వేంక॥ 29

ప్రాణిక యుండఁగవచ్చును।
గాని యహంకారమంటగారాదు క్రియా।
మానసము చరణంబున।
సానందుండగుచు వేంక॥ 30

అంతఃకరణ విశుద్ధతా।
యెంతయు లేకుండ నుకువు నేని నభేదం।
బంతట స్వార్థపరుండయి।
యంతంబునఁ జెడును వేంక॥ 31

ఈకలి వేదాంతులమని।
మాకును మీకగు నభేదమనుచును సాత్రుణ।
జేకొందురు చోరులకి క్రియ।
నా కపటాత్మకులు వేంక॥ 32

శారీరక ధర్మంబు లి।
వేరీతిగనంటు నాత్మనితర స్త్రీలణ।
జేరఁగ రాదో యుండు క్రమ।
హా రసికులరీతి వేంక॥ 33

విద్యాగంధము గల్గియు।
మద్యంబులు త్రావుటొప్పు మతి నిలకడకై।
సద్యోదర్శనమగు నం।
డా దృయబ్రహ్మంబు వేంక॥ 34

ఇంచుక తెలిసిన లోకము।
వంచింపఁగఁ జూతు రాత్మవంచనమానం।
బెంచ రధఃపతనం బా।
నంచెఱుఁగరు దాన వేంక॥

పరుల నుగికురించుటలో।
నుఱవగు కుశలత్వ మెంతయుందునో యంతౌ।
నరళగతికి దూరంబయి।
యరయండిది నరుఁడు వేంక॥ 3

చిత్తవిశుద్ధతతోఁ గిం।
చిత్తయినను జ్ఞానపథము చేకొన్న మదిఁ।
సత్తగు ఋజుమార్గంబులు।
హత్తి ఫలంబిడును వేంక॥ 37

సత్త్వాహారంబుల మది।
సత్వరముగ శుద్ధమాచు షట్ఛత్రు విన।
శత్వము నొందుచు బ్రికృతి మ।
హత్వక్రియలుదుఁగుఁ వేంక॥ ౩౮

తినువస్తుల సాంకర్యము।
లనేకములు జేరి గుణములందున మార్పుల్।
పొనరింప నెట్లు సాత్త్విక।
మనివానిఁ గొనుట వేంక॥ 39

భువిలోఁ గాలక్రమమున।
ప్రవర్తిలెడు లాభలోభభావంబుల వ॥
స్తువులఁ మనుజులు మార్పఁ గ।
న విస్వచ్ఛములెట్లు వేంక॥ 40

పట్టణముల నెక్కుడు జూ।
పట్టున నారోగ్యమెల్ల వస్తుగుణములఁ।
బుట్టుచుఁ గలుషా నిలమున
నట్టటు పెంపొందు వేంక॥ 41

పల్లెల నారోగ్య స్థితు।
లెల్ల నశించెను గృహాళి కెల్లలుగ పొలం।
బుల్లోభగరిమ కర్షకు।
లల్లన జేయంగ వేంక॥ 42

పెంటల పోగుల వీధుల।
వెంటఁ దుర్గంధజలము విడుచుటచే వె।
న్నంటిరు జల్ పొడసూపెడు।
నంటువ్యాధులును వేంక॥ 43

తొల్లిటి యాచారములఁ।
పెల్లగు ఛాందసములనుచు విడుచుటచే ని।
ప్డెల్ల యనర్థము లుర్విని।
నల్లుకొనం దొడఁగె వేంక॥ 44

ఆచారము లారోగ్య।
ప్రాచుర్యము లనుచు నేటి ప్రకృతివిధిజ్ఞుల్।
వాచారూఢతఁ బల్కుదు।
రాచరణలఁ జూపి వేంక॥ 45

ఉపవాసము సేయుటయుఁ।
దపనుస కెఱఁగుటయు గాంచినగు వారలె శా।
స్త్రపు పరిశోధనఁ దెలిసిరి।
అపారసుఖముంట వేంక॥ 46

గోసేవ సేయ మఱచిరి।
గోసస్య విలుబ్ధులెరి గోగ్రాసంబుల్।
భాసురమగు క్షేత్రంబుల।
నాసఁ దున్నుచును వేంక॥ 47

గోక్షీరము దేహము నెటు
రక్షించునో జననమాది గ్రహియించిన త।
ద్రిక్షణ విడువక గాంచరె।
యక్షయ లాభాప్తి వేంక॥ 48

గోమయ పరిశుద్ధతయును।
గోమూత్ర విశుద్ధ యోగగుర్వౌషధ హిం।
దూ మతవిధులుఁ జిరకా
లామోదములయ్యె వేంక॥ 49

ముదుసలి తలిదండ్రులఁ బలె
ముదివగు గోవృషభములను బోషించుటయేఁ।
మదిగోరక్షణ సఫలం।
దదుకుటయే నౌను వేంక॥ 50

ఆహార సాత్వికంబున।
దేహారోగ్యమున మనసు తిరపడుటయు ని।
గ్రహము గలగఁ దెలియును।
స్తోహంబని బ్రహ్మ వేంక॥ 51

మానసిక పరిభ్రమణము।
న్యానంబగు నేని వాంఛలుడుగుఁ దానఁ।
జ్ఞానాగ్ని ప్రశమదగ్ధం।
బా నురుసంచితము వేంక॥ 52

నిదురఁ లేచిన దాదిగ।
నెదురైనది స్వీయభోగ్య మిట్లగు ననుచుఁ।
మది గాంక్షించుచు గృషి సే।
యుఁ దలంచెడు నొకఁడు వేంక॥ 53

ఇతరుల సుఖ సంపదలఁ।
మతి కలఁగి యసూయపడుచు మంద ప్రజ్ఞఁ।
వెతకును వారలదోషము।
లతినిపుణత నొకఁడు వేంక॥ 54

ఇంటను రంభనుబోల్ వాల్।
గంటి గుణోపేతయుండఁ గామాంధుండై।
వెంటఁ జనుచో వెలందుల।
నంటఁగ నొకరుండు వేంక॥ 55

ఎన్ని తరంబుల కైనను।
సన్నగిలని కలిమియున్న సంపాదింపన్।
ఖిన్నత ప్రయాసపడు నొకఁ
డన్నము తినకుండ వేంక॥ 56

చిఱుతలయి యనుజులుండఁగ।
హరియించి కుటుంబ ద్రవ్యమంతయు ఋణముల్।
సరిజూపును వంచన నొకఁ
డఱుతలఁ గోయుచును వేంక॥ 57

న్యాయస్థానము లన్నిట।
బోయి కుయుక్తులను సూది మొనయంతైనన్।
దాయకు భాగంబీకొరుఁ
డాయము వెచ్చించు వేంక॥ 58

దౌర్జన్య మూలమున ధన।
మార్జించుచు హానిగ దుర్వ్యయపరచు నొకం।
డూర్జిత గౌరవ మబ్బునె।
యార్జన గతి లేక వేంక॥ 59

ఒక్కొక వ్యక్తికి దుర్గుణ।
మొక్కొక్కటి ప్రబలు వాసనోద్వేగము పెం।
పెక్కుఁ బ్రకృతి వ్యక్తంబయి।
యక్కత మణఁగవలె వేంక॥ 60

ప్రాణులుసుఖముఁ గోరుచు।
దానిని బడయంగ సర్వధాయత్నింతుర్।
పూనికపుష్ప మరందం।
బూను నళులరీతి వేంక॥ 61

నియమముగల సుఖము స్థిరం।
బయి యొప్పుచు సత్యమైన యానందమిడుఁ।
వియదంబువు కొలఁకుల జే।
ర్పయినిల్చెడు కరణి వేంక॥ 62

నరునకు సుఖముఁ దుఃఖము।
వరుసను జీవితమునందు వచ్చుచునుండుఁ।
సరగునదినముఁ రాత్రియు।
నరుదెంచెడి మాడ్కి వేంక॥ 63

మానసిక నిశ్చలత్వం।
బూనఁగనౌ సుఖము దుఃఖ మొకరీతి సదా।
నాణెంబొకటి యెయిరుదెస।
లైనటు భేదంబు వేంక॥ 64

శీతోష్ణాది ద్వంద్వా।
పేతత యభ్యాసమునను బృథువైరాగ్యో।
పేతతఁగల్గును తులసిర।
మైతగునస్పృశత వేంక॥ 65

వ్యామోహాక దృశ్యంబులు।
వేమరుదోషముల వెదకి విడువఁగఁజెల్లుఁ।
కామిని చర్మాంతర్మాం।
సామేధ్యత లట్లు వేంక॥ 66

మేడలు తోటలు భూములు।
తోడఁ రావనుచుఁ బ్రీతిదొంటఁగంగవలెఁ॥
వీడమెరైలును మఱువా।
టాడక గమ్యమున వేంక॥ 67

సాధుల సాంగత్యమునఁ।
బోధిత వైరాగ్యపథము బొందునరుఁడు పూ।
లాధారంబుగ దారము।
సాదృతి తలకెక్కు వేంక॥ 68

స్త్రీ పురుష నైజభేదము।
లీపృథివిఁ సృష్టిలోనె యేర్పడె; వానిఁ।
బాప్రిపుగ వర్తింపనిచో।
నాపదలే కల్గు వేంక॥ 69

ప్రేమ క్షమాదిగుణములు।
కామినికెక్కుడగు వాని గల్గినక్రియలఁ।
నేమమున జేయ నొప్పెడు।
నామెయి పురుషులకు వేంక॥ 70

పాతివ్రత్య సుశీలత।
జాతివినాశంబునుండి సంరక్షింపఁ
హేతువది విడువకుండిన।
నాతత శుభదంబు వేంక॥ 71

బహిరంగ వ్యాపారము।
సహజంబుగ పురుషులకు విసర్జింపుచు లో।
గృహకృత్యము దీక్షఁగనో।
సహారహ మబలలకు వేంక॥ 72

ఒండొరుల విధులు గలియఁగ।
దండిగనొకటై గృహస్థధర్మము నిండా।
మెండగుధీసంపద తమ।
కండయి తరియింత్రు వేంక॥ 73

పురుష దురభ్యాసములను।
కరింపఁ జనదెందు సాతిఘనవర్తనచే।
మరలించి యతని శ్రేయం।
బరయుట శ్లాఘ్యంబు వేంక॥ 74

యౌవనము ఝరీవేగము।
జీవనమున్ బుద్బుదమని చెప్పిరిసూరుల్।
బోవలముకుమార్గంబుల।
నావలగతి నెఱిఁగి వేంక॥ 75

స్వల్పమగు కారణంబున।
కల్పించుచు కయ్యమంతఁగష్టలపాలై।
నిల్పదురది జన్మాంతం।
బల్పజ్ఞులుభువిని వేంక॥ 76

లంచముగొను నధికారుల।
పంచను జేరుచును మిగులఁ బగసాధింపన్।
సంచులధనమున్ ద్రోయుదు।
రంచన తెలియకయె వేంక॥ 77

ధనమెట్టులో గొనుటే పా।
వనమను నధికారులదియె వమ్మైపోవన్।
గని దుఃఖింతురు చంచల।
మని యెఱుగరుశ్రీని వేంక॥ 78

జనులను బీడించుటయే।
ఘనమనుకొని ప్రభులుదుండగము లొనరింపన్।
వెనుకకు దూలుచు పైబడు।
నని తెలియరు వాని వేంక॥ 79

ప్రకృతిఁగనఁదోచు నొక రొక।
రికి నుపకారులుఁగ నౌట వృక్షములు నదుల్।
ప్రకటోచ్ఛ్వాసంబు లనుభ।
యకులంబుల్ పెరుగు వేంక॥ 80

మహిఁదున్నుచు ఫలియింపఁగ।
సహాయపడు నెద్దు కాపు సంరక్షించున్।
మహిషంబు మే పక్షీరము।
అహీనగతి నిడును వేంక॥ 81

భూజములు నదులు నొసఁగవె।
సాజపు మధురంపు ఫలరసంబుల నీరున్।
రాజిలు నుత్తమమై య।
వ్యాజపు దానంబు వేంక॥ 82

స్థావరములు జంతువులున్।
గావింప పరోపకారకార్యములు నదుల్।
జీవితమున నేలొకొ క్రొ।
ధా విష్టతఁబోర వేంక॥ 83

ఎన్నోవిధములఁ బ్రకృతిని।
క్రన్నన మథియించి యైహికపు సౌఖ్యము బొం।
దన్నేర్చిరి పాశ్చాత్యులు।
ఔన్నత్యము గనిరి వేంక॥ 84

దూరపు వస్తుల గనుటయు।
దూరపు గానముల వినుట దూరస్థులతో।
చేరువగతి మాటాడుట।
నౌరా సిద్ధించె వేంక॥ 85

వింత లింక నెన్నియున్నవె।
యంతర్లీన మగుచుండి యా ప్రకృతినిధి।
మంతు లెవరేమి గనుదురో।
యంతముగనరాదు వేంక॥ 86

ఆనందము గూర్చుటె కా।
దా నాశంబునకు మూలమని దృటిలోనన్।
సేనలుగూలుట గనమె వి।
షానిలముంబీల్చి వేంక॥ 87

వైమానికంపు దాడుల।.
చే ముదుసళ్ళర్భకులును స్త్రీలు నశింపన్।
గా మీాతె ప్రకృతిశాస్త్ర ము।
హా మహిమంబిలను వేంక! 88

భువిదుష్టుని చేతంబడు।
ప్రవిమల వస్తువును దానపాయము తెచ్చున్।
పవనాగ్ని యాతతాయికి।
నవుగృహ దాహాకము వేంక॥ 89

పరమాహింం సాధర్మ్మం।
భిదవగు మతమ్మూను వారె హింసాపరులై।
మురియుదు రదె నాగరకత।
యారయఁగఁ గాబోలు వేంక॥ 90

దౌర్జన్యపు మార్గముల వి।
సర్జించినగాని గనరుసౌఖ్యము నృపు లం।
తర్జాతి సభలన్యాయం।
భ్యార్జవగతి నడిపి వేంక॥ 91

అధ్యాత్మజ్ఞత ప్రకృతి।
స్సాధ్యములకుఁ దోడుపడిన సర్వహితంబా।
బాధ్యతలల లోకశాంతి కు।
పాధ్యాయతఁ జూపు వేంక॥ 92

ప్రాక్పశ్చిమ దేశజ్ఞులు।
వాక్పటిమఁ జెప్పి రిదిశుభంబని దీనిఁ।
దృక్పథమున నుంపఁగ స।
మ్యక్పరిశోధనల వేంక॥ 93

కొండొక దేశ మొకంటఁ।
మెండగు విజ్ఞాన మొంది మెరయుచునుండుఁ ।
ఒండొరు లది గణియింపుచు।
నండను జేరవలె వేంక॥ 94

చిరకాలత పశ్చరణన్।
బరిశోధనలన్ గ్రహించి ప్రకృతిన్ లోకో।
ద్ధరణ మొనర్చు మహాత్ముల।
నరయఁగ వలెనెందు వేంక॥ 95
వెలుపలి ప్రకృతిని దనలో।
పవిప్రకృతిని దెలియువాఁడు పరిపూర్ణుండో।
ఇలవ్యక్తులల్లో జాతులు।
నలరున్ బెంపొంది వేంక॥ 96
ఉభయప్రకృతి జ్ఞానము।
లభించు త్వచ్చరణభక్తి లాలసులకు భూ।
త భవిష్యద్విజ్ఞానము।
నభయము సంసృతిని వేంక॥ 97
ఎంతదృఢభక్తి గల్గునో।
అంత విశుద్ధతయు శమము నలరారునెదన్।
శాంతము స్థిరమౌ మనసున।
సంతయు బొడకట్టు వేంక॥ 98
సందేశము నీదై భువి।
యందలరుంగాత శాంతినంది సుఖింపన్।
బొందుదురుగాక శాంతం।
బందఱులోకమున వేంక॥ 99
ఈమకుటముతో శతకము।
శ్రీమజ్జనకుండు చెప్ప శిథిలంబయె మున్।
నేమగుడి చెప్పఁగడఁగితి।
నామూలాగ్రముగ వేంక॥ 100

# తప్పొప్పుల పట్టిక

| పద్యము | తప్పు | ఒప్పు |
| --- | --- | --- |
| 4 | దైవశమ్మలై | దైవతమ్మవై |
| 6 | యింద్రియము | యింద్రియముల |
| 9 | వెలయు | వెలయ |
| 11 | నెఱిఁగి | నెఱిఁగిన |
| 19 | మీఱు | మీఱ |
| 22 | మనుచును | మయనుచు |
| 35 | బెంచ | చెంచ |